# లోకోభిన్నరుచిః

భమిడిపాటి కామేశ్వరరావు

రు 1/-

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయములు

# బస్తీరోడ్డు

"రోడ్డు" అనేది తెలుగువాళ్లు అప్రయత్నంగా వాడే ఇంగ్లీషుమాటల్లో ఒకటి. ఇంగ్లీషువారు మనకి పబ్లిగ్గా తెచ్చి పడేసిన పదార్థాల్లో రోడ్డుకూడా ఉంది. సాధారణంగా శకటాలు కూడా వెళ్లడానికి వీలుండి, రంగుమీరి ఉన్నప్పుడు మాత్రమే, ఏదేనా మార్గాన్ని రోడ్డు అంటారు. రోడ్డును గురించిన పుస్తకాలు తెలుగులో లేవు. ( 'నాకు తెలియదు' అనేకబురు చల్లగా చెప్పడానికి 'లేవు' అనేది ఆలంకారికం. ) రోడ్డులాంటి అధమ విషయంగురించి రాస్తే, కావ్యంకూడా నీచంఅయిపోవచ్చుకదా అనే భీతిచొప్పున సమర్థులు దాన్ని వొదిలేసి ఉంటారు. కాని, ఆసంగతి తెలియకపోడంవల్ల గావును, అన్యభాషల్లో వాళ్లు రోడ్డుని గురించి వందలాదిగా పుస్తకాలు ప్రచురించారు. మానవోపయోగకరంగా ఉండే వృత్తాంతాలు ఎవ్వైనాసరే గ్రంథస్థం అయినప్పుడు పండితులు దుర్ముహూర్తంలేకుండా చూసుగుని క్షమించి పారెయ్యడం మంచిది. నేలబారురచన మాత్రం చెయ్యగల అస్మదాదులకి 'రోడ్డు' సరిపడ్డ విషయం. ఏమంటే, ఇందులో నేల విడిచి సాం అవసరం లేదు. చాలా పూర్వకాలంలోనే మనుష్యులు నడవడానికీ, గుఱ్ఱపుదళాలు వెళ్లడానికీకూడా, అనేకదేశాల్లో శాశ్వత మార్గాలు ఉండిఉన్నట్టు తెలిసినా, రోడ్డు అనేమాట పుట్టి ఆట్టేకాలం కాలేదు. ౧౭౩౬ లో

పార్లమెంటుసభకి ఓప్రభువు తనబండిమీద వెళుతూండగా, అప్పటి లండన్ బురదవీధుల్లో ఒకచోట ఉన్న ఊబిలో ఆయన బండీగుర్రాలూ దిగబడి ఊరుకుందట. ఈరెండువందల ఏళ్ళలోనూ, ఇతరదేశాల్లో జనం రోడ్లనిగురించి చేసిన ఆలోచనా, చూపెట్టిన ఆచరణా, సాధించిన అభివృద్ధీ మనికి తెలుస్తూన్నప్పుడు, అందరూ రోడ్డుని గురించి దుమ్మురేగేటట్టు ప్రచారంచేసుగుని కాంగ్రెసులు కూడా జరుపుతూన్నప్పుడు, రోడ్డు అనేవిషయాన్ని మనం కొట్టి పారెయ్యడానికి వీల్లేదు — అసలు అనుక్షణం కాళ్లకి చుట్టుగుని ఉండే విషయాన్ని పారెయ్యడం శక్యమూ కాదు, శౌర్యమూ కాదు. మరోకసంగతి: మానవులు కలిసిగాని జీవించలేరు. ఒంటరిగా జీవించగలవాళ్ళు ఉండవచ్చు, ఉన్నారు, వాళ్ళు మానవాతీతులు. పెద్ద స్థలంలో కొద్దిమంది మాత్రంకలిసి పల్చపల్చగా ఉండేలాగు నివాసం అయిఉంటే దాన్ని గ్రామంఅనిన్నీ, కొద్ది స్థలంలో చాలామందికలిసి ఒత్తిడిగా నివసిస్తే దాన్ని బస్తీఅనిన్నీ అంటారు.

ఒకదేశంలో ఈచివరనుంచి ఆచివరకి ఉండే ప్రతిచిన్నస్థలం కూడా కామధేనువు లాంటిదైతే, ఆదేశంలో ఉండుకున్న గ్రామాలసంఖ్యే ఎక్కువగాఉంటుంది, ఇంకా గ్రామాలు పుడుతూంటాయి. కాని, ఏదేనాదేశంలో చవిటిపఱ్ఱలూ, ఉప్పుచెరువులూ, ఇసకఎడార్లూ, బోడికొండలూ, గనక విస్తారంగా ఉంటే, జనం ఎక్కడబడితే అక్కడ నివసించడం అసంభవం అయి,

కొత్తగ్రామాలు పుట్టడానికి ఆస్కారంలేక, ఉన్న గ్రామాలే బస్తీలుగా మారడానికి యత్నిస్తాయి. ఈదేశం, వైశాల్యం ధర్మమాలని, ఏరకంలోనేనా సరే చేరుతుంది. ఇక్కడ లేని రకం ఉండదు. విస్తారం గ్రామాలూ ఉన్నాయి, కొత్తవి పుడుతూనూ ఉన్నాయి. కొన్ని బస్తీలుగానూ మారుతూ న్నాయి. స్థూలంగా చెప్పాలంటే, జనాభా ఒక పాతికవేలకి దగ్గిరపడినా, లేక ఎంత వంకరటింకరదైనాసరే ఒక కంకర రోడ్డు దాంట్లోకి చొరబడినా, గ్రామంఅనేది బస్తీగా ముదురు తుంది. ఒక బస్తీనించి ఇంకోబస్తీ చేరుకోడానికికూడా ఘంటాపథాలు ఉంటాయి. ప్రస్తుతం వాటిసంగతి కాదు. ఒకేబస్తీలో ఉండేజనం, తమతమ వ్యవహారం సందర్భాలు చూసుగోవలిసిన అవసరం వచ్చినప్పుడు ఒక గృహందగ్గిర్నించి మరో గృహానికి వెళ్ళాలి. ఈరీతిగా ఘోషాజనం తప్ప కడం అందరూ చేస్తూంటారు. అందుచేత, ఇళ్లమధ్య వీలైనంత ఖాళీస్థలం అశేషజనం ఉమ్మడిగా వాడుకోడానికి కేటాయించి ఉంటుంది. అటువంటి బస్తీవీధిరోడ్ల సంగతి కొంచెం ముచ్చటించడమే ఇప్పుడు సంకల్పం.

రోడ్డు అనేపదార్థం మాయిమంత్రంవల్ల చిటికిలో తయా రయే బాపతు కాదు. దానికి కష్టకున్నన్ని రూపాంతరా లున్నాయి. వాటిని జన్మాంతరాలన్నా ప్రత్యవాయవు లేదు. అసలు దుర్గమస్థలంలో మొట్టమొదట కాలు పెట్టేవాడు సాహసుడయి ఉంటాడు. వాడిఉద్దేశం వాడికే తెలిసిఉంటుంది.

ఒక్కొక్కప్పుడు వాడికీ మొదట తెలియదు. వాడు ఎక్కడికో పోతాడు, ఏదోవోటి అవుతాడు, గాని వాడి ఛాయ మాత్రం మిగిలి ఉంటుంది. వాడి ఉద్దేశం ఏమిటో, వాడేమయాడో కనుక్కోడానికి వాడి అడుగుజాడల్లో వెళ్లేవాళ్లు ఉంటారు, లేకపోతే క్రమేపీ పుడతారు. వాళ్లు మొదటి వాడి దారివల్ల ప్రపంచానికి అవసరం ఉంటే ఆదారి ఖాయపరుస్తారు. గమ్యం ఫలానా అని ప్రత్యక్ష సాక్ష్యం దొరికినమీదటే జనబాహుళ్యం ఆదారి పడతారు. మరి కొంతకాలానికి ఆదారి రహదారీ అవుతుంది. దాన్ని ఎత్తు చేస్తారు. దాని వెడల్పు స్థిరంచేస్తారు. దాన్ని అడ్డవస్తువుల్ని తీసేస్తారు, ఏళ్లని దాటేస్తారు. ఆదారినిగట్టిపరిచి నునుపు చేస్తారు. రంగుగా ఉండి ఆదారి మానవుల్నీ జంతువుల్నీ శకటాల్నీకూడా ఆకర్షిస్తుంది. ఆరూపందాల్చినదార్ని “రోడ్డ”ంటారు. పల్లెటెదిక్కుల్లో ఉండేదార్లు ఇన్ని రూపవికారాలూ దాల్చేసరికి పుష్కరాలు ఎగిరిపోతాయి. బస్తీలో అయితే ఒకప్పుడు సంవత్సరాలుమాత్రం జరిగిపోతాయి. బస్తీలోకూడా ఇళ్లవరసల మధ్య ఉండేస్థలం ప్రథమంలో దాని చిత్తంవచ్చినట్టే ఉంటుంది. ఎటొచ్చీ వేసంకాలంలో మేకుల్లాగ మొనలు తేరిన బెడ్డల్తో ఉంటుంది, వానాకాలం చిన్నపంటకాలవలా ఉంటుంది. పిల్లలూ పెద్దలూ ఊటలూరగా ఊరగా, అది చదునై, మట్టిపడి, లేస్తుంది. అదే కంకరవీధిఅయి, దానిరేఖ బయలుపడాలీ అంటే, అది ఇంతో

అంతో పెట్టిపుట్టింది అయిఉండాలి; అనగా, ఆవీధులో కాపరం ఉండే ప్రతీద్విపదుడూ మామూలు మనిషై ఊరు కోక, చివరకి ఏఒకడేనా బ స్త్రీపాలకసంఘంలో ఒకసభ్యుడై ఉండాలి. రోడ్డులేనప్పుడు అతనికి ఉండే చికాకు మర్త్యుల్లో ఎవరికీఉండకూడదుట. లేకపోతే, అక్కడ కాపరంఉన్న వాళ్లల్లో ఒకడైనా ప్రభుత్వంవారి పరిచయుడైనా కావాలి, లేక ధనవంతుడైనా కావాలి, నిలువుగా చీరేవాడో, అడ్డంగా బాదేవాడో, లేక తెగతిట్టేవాడో, తెగ ఆశ్రయించేవాడో కావాలి. అదీకాకపోతే, ఒక గవర్నరుగాని అతనిలాంటి గొప్పమనిషిగాని ఆ వీథివెంట వెడతాడని తెలియాలి! ఆయన ఇక రేపోమెల్లుండో ఆదార్ని వెడతాట్టఅని తెలియడంతోటే, అతని మహిమవల్ల, రామపాదధూళి తగిలింతరవాత రాయి మనిషైనట్టు ఆయన పాదం చెప్పులో ఉండడంనించి తత్పదధూళికైనా నోచుగోనైతిని గదాఅనిచెప్పేసి ఆదారి రాయిలా అయిపోతుంది. అది అట్లా అయిపోయేటప్పుడు ఇంతోటి విద్యూరాణ్యానికేసి ఇస్త్రీపట్టలు కట్టిన కుళ్లుజనంలాగ వెల్లవేసుగున్న మురుగుతూములు తెలతెల్లపోతూ చూస్తూంటాయి. అదే అదను, మళ్లీదొరకదు, అని కొన్నిదార్లు అప్పుడు కంకరకూడా అవుతాయి. పురపాలక సంఘంలో అందరూ కంక రవకపోవడంవల్ల, కొన్ని దార్లు ఎన్నటికీ కంక రవనే అవవు. ఒక్కొక్కప్పుడు కంకర వగైరా తెచ్చి, నడవడానికికుడా వీలులేకుండా ఎడాపెడా పొయ్యడం సమేతూ జరిగిపోతోంది. అప్పుడొస్తుంది ఎగే

సుగుని ! ఆవీధులో ఉన్నస్థలం స్థలంలా పడి ఉండచ్చు, పైవాళ్ని ఎదో పేచీపెడుతుందిగావును. దాంతోటి వారికి తలోమోస్తరుగానూ ఆనేలమీాద కోపంవచ్చి, ఆకంకర్ని ఉన్న పళంగా వొదిలేస్తారు. అయితేం ! ఉన్నపళంగా ఏదీ ఉండదు, కంకరా ఉండదు. కోతుల్ని కొట్టడానికీ, కాయలూ, పళ్లూ రాలగొట్టుకోడానికీ, పిల్లలు వాట్ని వాడేస్తారు. ఒక్కొక్కప్పుడు అవెట్టి వీధిదీపాల అద్దాలు బద్దలుకొట్టి మునిసిపల్ వారిపనే చూస్తారు. పెద్దలుకూడా కాస్త చీకటడి, మాటు మణిగింతరవాత, కాసినికాసిని చొప్పునే ఆరాళ్లని సెనగపప్పులా లగాయించేసి, అవీనూ, డబ్బెట్టుకొనుక్కున్న యజమానియింటికి ఇటికెలు తోలుకెడుతూన్న బండి వాడు దయతో దానం చేసినయిటికెలూపెట్టి నిర్మాణ కార్యక్రమం సాగిస్తారు. అల్లా ఆరాళ్లన్నీ మాయం అయినా సరే ఒకొక్కవీధిలో నేలకి పాలకసంఘం అంటే భయం లేదు. జనం అంటే జాలిలేదు. ఇంకోసంగతి. ఈకాలంలో జనం తిన్నగా తిండేనా తిన్లేరనిన్నీ, వెనకటివాళ్లు రాళ్లు కుడా తిని హరాయించుగునే వారనిన్నీ కొందరు ముసిలాళ్లు కోస్తూంటారు. కాని, ఇప్పుడుకుడా కంకరరాళ్లయొక్క విలవతినేసే రోడ్డునిర్మాత లున్నారని వాళ్లతో వాదించి చెప్పి, ముసిలాళ్లని పిన్నలు నెగ్గచ్చు. ఏమైతేం, కొన్ని అవస్థాభేదాలు పొంది దెబ్బలు, పోట్లు, నరుకులు, అణుపులు, నొక్కులు, తిట్లువగైరా తినితిని, చివరికి బస్తీరోడ్డు అవత

రిస్తుంది. సాధారణంగా ముందుతవ్వి, మరీ పెద్దగోతు లుంటే వాటిల్లో పెద్ద రాయెట్టి, చిన్నసైజు కోసురాయి సర్ది, ఎర్రకంకరో తెల్లకంకరోచిమ్మి, ఇసగపోసి, నీళ్లుచల్లి చేసేపద్ధతి అవలంబిస్తారు. (మహాబస్త్రీల విషయంలో, వాటి వాటిదానిబట్టి పలకరాతివీ, సిమెంటువీ, తారువీ, కర్రవీ రోడ్లు వెలుస్తాయి. వాటి ప్రమేయంకా దిప్పుడు.) రోజు గడవనివాళ్లూ, జీవితం నడవనివాళ్లూ వచ్చి, తక్కినప్రపంచం నడిచిపోయే నిమిత్తం చెమటతో రోడ్లు వేస్తారు. కాని, ఎంతెంతటి శ్రమలుపడి వీటిని సృష్టిచేసినా, వీటిల్లోవీటికి బొత్తిగా జాత్యభిమానంలేదు, సోదరభావం లేదు.

వీట్లయొక్క రకాలకి హద్దులేదు. చాలా రకాలు మా ఊళ్ళోనే దొరుకుతాయని ప్రతీఊరి ప్రతీవాడూ విర్రవీగడమే, ఎవడిమాట నిజమో తేలకుండా. కొన్ని కేవలం గజం పన్నాః రోడ్లు. తెలుగు లిపిలో తలకట్లు మూలబడడంచేత గజం అంటే ఏనుగు అనుకోగలరు. కాని ఇక్కడి అభిప్రాయం "గజం" అనగా మూడడుగులు నేల — అయినా మళ్ళీ వామ నుడు కోరినంత సైజుది కాదు! కొన్నిరోడ్లు మనిషి పన్నా — ఆ మనిషైనా భారీరకం అయితే పీతనడక నడిస్తేగాని అతనికి జరుగుబాటుండదు. కొన్నింటికి వక్రభావమేకాని ముక్కుకి సూటిగా పోదామని లేనేలేదు. ఈ సంగతే దొరకపుచ్చు గుని, చుట్టుప్రక్కల దొరకగల వక్రత్వం యావత్తూ తమ ఊరిరోడ్లే గుత్తకి తీసుగున్నాయనిన్నీ, అందులో మరేమీ

వాటా మిగలక పోడాన్నించి తమ ఊరి జనం అశేషం ఋజు మార్గవర్తులయి తీరవలిసొచ్చిందనిన్నీ, ఒకొక్క బస్తీ కవి బడాయి కొడుతూంటాడు. నాగరికిత ఎరగని రోజులుగనక పూర్వం 'సూత్రపట్టినట్లు' ఒక బస్తీవీథులు ఉండేవిట! ఇతర బస్తీలల్లో రోడ్లు దిక్కుమాలిన రోడ్లనిన్నీ తన ఊళ్ళోవి దిక్కున్నవనిన్నీ ఒక నగరప్రియుడు ఒకచోట ఒకపేచీ లేవదీశాడు. ఎంచేత అని అడిగేసరికి, 'దక్షిణాముకు మాత్రము బండ్లుపోవాలి. పడమరకు మాత్రము జంతువులు కదలాలి' అని దిక్కు తెలుపుతూండే రోడ్లు తన ఊళ్ళోగాని లేవని అతడుసమర్థించి నెగ్గుకు పోయాడు. కొందరు మనుష్యులకిమల్లే కాకుండా, కొన్ని రోడ్లు ఉచ్చనీచాలు గల ఘటాలు. అందుకని వాట్లమీాదికి ఏదేనా బండీ వచ్చినప్పుడు, ఆరోడ్లు ఆంబోతుల్లాగ కోరచూపులు చూసి ఒడుపు కనిపెట్టి, ఆబండీని బోల్తాకొట్టిస్తాయి. ఒకవేళ ఏమరుపాటుగా నడుస్తూండే మనుష్యులు గనక వచ్చారా, వాళ్ళ కాళ్ళూ చేతులూ అధమం నడుమూ విరిచేస్తాయి. కొన్ని మరీ నిర్మోహమాటపు రోడ్లు మరీ హెచ్చుతగ్గుగా వ్యవహరించడం వల్ల బళ్ళల్లో జనం కొయ్యాయిపోతూంటారు. 'అచేతనంబులు చేతనరీతి దనర, చేతనంబులచేతనభాతి నొనర' వీణ వాయింపు ఉన్నదని, ఒకకవి అన్నాడు. నేడుకుడా చాలా పాటకచేరీలూ, కొన్ని రోడ్లమీాద ప్రయాణాలూ అంతటివీ ఉన్నాయని మనం గర్వపడవచ్చును. కొన్నిరోడ్లుగల వీథుల్లో

కాపరంచేస్తే, ఎండాకాల వానకాలాల తేడాలు తెలియకుండా పోతాయనిన్నీ, రోడ్లే కాలవలుగా మారడంచేత, 'ఓడలు బండ్లవచ్చు బండ్లోడలవచ్చు' అనే మాటల్లో ఉండే సంశయత్వం పోతుందనిన్నీ కొందరన్నారు. కొన్నిరోడ్లమీద, మధ్యగా, మురుగు పోయేనిమిత్తం, ఒక్కగాడి ఉంటుంది. రోడ్డు దేవిగారి పాపిడికాదుగదా అన్నట్టుగా. మండు వేసవిలోకూడా రోడ్డు మధ్యగా ప్రవహించే శక్తిగల మురుగుకాలవల్ని ధరించిన రోడ్లున్నాయి. వీటిని చూచినప్పుడు, పర్వతాల్లో పుట్టి మంచుకరగడంవల్ల వేసవిలో ఎక్కువ నీటితో ప్రవహించే నదులు జ్ఞాపకంవస్తాయి. ఎటొచ్చీ, నీటిలో నీరు ఘనీభవించిన కుళ్ళులో సమపాళంగా మిళితమై నల్లగా ఉండి 'కృష్ణ' స్మరణ చెయిస్తుంది. ఒకొక్క బస్తీలో అధికార్లు ఈ నలుపురంగులోనే కాకుండా అసలైన కంపులోకూడా అద్వితీయమై ఒప్పేటటువంటి కొన్నికొన్ని సైడుకాలవలకి విహారాది విషయాల్లో సక్రమమైన ట్రైనింగు ఇచ్చి, వాటిల్లోఉండే నీటిమహాత్యం అనుభవించకపోడంచేత పౌరులు చెడిపోతారేమో అనే బెంగ చొప్పున, అవి మరోచోటికీ మరోచోటికీ తమ యిష్టంవచ్చినట్లు లేచిపోకుండా, తమ ఆజ్ఞానుసారం, చేరువనున్న మంచినీటికాలవల్లో కలిసేలాగచేసి, జనం శ్రమించి అట్టే దూరాభారం వెళ్ళక్కర్లేకుండానే ఆ 'గంగాయమునాసంగమపుణ్యాదర్శనఫలం' జనానికి పన్ను లేకుండానే మంజూరు చేసి, ఆజనం అల్లాంటి పుణ్యాన్ని పొంది జీవన్ముక్తులవడానికి

నానాతిప్పలూ పడుతూంటారు. కొన్నిరోడ్లు తమాషాగా కనిపించి, కొత్తవాణ్ణి బెదిరిస్తాయి. దాంతోటి ఆకొత్తవాడు అనుమానిస్తూ నడుస్తాడు. అవి వాణ్ణి తిప్పి తిప్పి చివరకి ఎవరియింట్లోకేనా లాక్కుపోతాయో, లేక వీథులో పడే స్తాయో వాడికి తెలియదు.

బస్తీరోడ్లయొక్క ప్రత్యేక విశేషం అయిన దుమ్ము గురించినది పెద్దఘట్టం. దుమ్ము నిరంతరంగా బస్తీలో విజృంభిస్తూ ఉంటుంది. బస్తీపాలకులు దాంతో యుద్ధంచేస్తూంటారు. వారు ఇతరవిషయం ఏదేనాసరే దుమ్ము రేగకొట్టగలుగాని విషయమే దుమ్మైన్ అదే రేగిపోయే దయినప్పుడు, ఏమీ చెయ్యలేక పోతూంటారు. అసలు దుమ్ము లేకుండా చేస్తే సరి, ఇహ నెల్లా రేగుతుంది దాని మొహం! అని, కొందరు సలహా ఇస్తారు. అందుకని, కొన్నిచోట్ల బస్తీరోడ్లు ఇల్లూ వాకిళ్లూ తుడిచినట్లుగానే చీపుళ్ళతో గంటలో తుడిచేస్తారు. దానిఫలితం ఏమీ అంటే ఇరవైనాలుగు గంటల్లో చుట్టుప్రక్కల గృహావృక్షాదులమీద మలామా చెయించినట్లు సర్దుకునేదుమ్ము ఒకగంటలోనే గబగబా సర్దుకుంటుంది. ఈ పద్ధతిలో పథికులకికంటె సమీప గృహస్థులకే ఎక్కువవాటా దుమ్ము కిట్టుతుంది. కొన్నిచోట్ల రోడ్లు కూలీలచేతా, కొన్నిచోట్ల కార్లచేతా, తడిపిస్తారు. మొదటి పద్ధతి చాలమంది బీదవాళ్ళకి పని చెబుతుంది గనక, అంతమందికి జలక్రీడోద్యోగం ఇవ్వడం ఏమిటని చాలా బస్తీల్లో అది మానేశారు. ఒక్క

యంత్రప్రభావంవల్ల వెయ్యిమంది పనివాళ్ళు మూలపడతారు. అంచేత గావును బస్తీలో నీళ్ళకారు! దానికి చెయ్యబడిఉండే ఏర్పాటు మూలాన్ని జౌతుఖానాలోంచిలాగ నీరు ఇటూ అటూ చటుక్కున చిమ్మచ్చు, చటుక్కున ఆపచ్చు. ఆ అధికారం సాధారణంగా డ్రైవరు చేతిలో ఉంటుంది. కాని, ఆయంత్రం అతణ్ణికూడా దగాచేసి, తనఖులాసా చొప్పున పోతూండడం కూడా కద్దు. డ్రైవరు ఉద్యోగానికి కారకులైనవా రెవరైనా పక్కనించి పోతూంటే, అది చటుక్కున ఆగిపోతుంది. కాని, ఇతరబస్తీజనుడుగాని, ఇతర గ్రామస్థుడుగాని, స్త్రీలుగాని అయితే, పెద్ద-పిన్న ముసలి-పడుచు తారతమ్యం గమనించకుండా నీరు చిమ్మేస్తుంది. అందుకని, ఏకొద్దిమందో తప్ప తక్కినవారు నీటికారు ఎప్పుడు తననీటిముళ్లు విప్పుతుందో - ఏదుబందిలాగ - అని భయం చొప్పున దూరాన్నుంచే జాగ్రత్త పడతారు. రోడ్డు తడపడం దుమ్ముని అణచడానికి. అప్పట్లో ఆపని నెరవేరినట్లు కనిపిస్తుంది. కాని, తడిపిన దుమ్ముమీద శకటాదులు వెళ్లడం వల్ల తెగనలిగి వస్త్రకాళితం చేసినట్టు మరీ కాటిగలా అయి, ఎండొచ్చి తడి యిగిరింతరవాత, పూర్వం తాడిప్రమాణాన్ని లేచేది, ఆ సాయంత్రానికి తారాజువ్వలా లేచి, తలపెట్టిన ఉద్దేశానికి విరుద్ధం ఫలించేటట్టు చేస్తుంది. ఇదిగాక, అలవాటుగా నీళ్ళు పోసేసరికి, రోడ్డుమీది మెరకపల్లాలు ఖాయపడి, సంవత్సరంలో బయల్దేరే కతకలు నెలలోనే సిద్ధిస్తాయి.

'అయినాసరే, ఒప్పుగోడానికి, ఈ భాగ్యం అన్నింటికీ అబ్బదు.
కొన్ని బస్తీలలో వానకాలం గంభీరంగా ఉంటుంది. ఇళ్ళు ద్వీపాలు: రోడ్లు కాలవలు: మనుష్యులు పడవలు! కొన్ని రోడ్లమీది మెత్తటిసరుకు యావత్తూపోయి, శల్యాల లాంటి కోసురాళ్లుమాత్రము ఆరితేరి పొడిచేలాగ చూస్తూ ఉంటాయి. సైడుకాలువలు, పరాయిగా పరాయిగా కొట్టుగొచ్చిన మట్టితో పూడి, బలిసి, రోడ్డుతో తుల్యం అవుతాయి. అట్లాంటప్పుడు ఎక్కడ నడిచినా జనానికి బాధలేదు. కొంతదూరాన్ని మోటారమ్మా వారు దర్శనం ఇవ్వగానే, జనం ఎక్కడివాళ్ళక్కడ సర్దుకుంటూ, దుష్టుడికి దూరంగా ఉండమన్నాడు' అనుకుంటూ ఎవరిజాగ్రత్త మీద వాళ్ళుంటారు. మోటార్ల వేగాన్ని తిట్టేవారు, గొడుగులు అడ్డుగా ఒగ్గేవారు, అరుగులమీది కెక్కి ఖణా యించేవారు, కట్టుగొచ్చిన చాకింటిడ్రెస్సు వసంతం కొట్టి నట్టు కాగా, 'వెధవపొగరు! కళ్ళుకనిపించవ్!' అని తిట్టు కుంటూ డ్రెస్సుకేసి చూసి దుఃఖించేవారు, — ఇలా రకరకాలుగా ఉంటారు. జారడం, దుస్తులకీ కాళ్ళకీ డామేజీ తెచ్చు గోడంకూడా మామూలుదృశ్యాలే. కొంచెం రేగడమట్టి పాలు ఎక్కువగాఉన్న రోడ్డుమీద నడిచేటప్పుడు జర్రు బాములు వేళ్ళసందుల్నించి ఈటెల్లాగ లేచి కంట్లో పడు తూండడం కూడా కద్దు. మామూలు చెప్పులవాళ్ళకేం గాని, ఆను చెప్పులవాళ్ళకి సీలమండలగాయతు నడ్డిదాకా

వెనకవేపున రోడ్డుబురద చిలకరింపు సంక్రమిస్తుంది. కేవలం స్లిప్పర్లు తొడుక్కొని తప్పి తప్పున నడిచేవాళ్ళకి, బాడీ చిందులు బాగా చిమ్మబడ్డి రవ్వల్లాగ లేచి నెత్తిదాకా వ్యాపించి యజమానికితప్ప తక్కిన అందరికీ కనిపిస్తూంటాయి. కొన్ని రోడ్లమీాది మెత్తనికంకర, కాటికలాంటి అడుసులా తయారై, జనంకాళ్ళకి పట్టుగోడంలో, బస్తీలో ఉండే స్త్రీ పురుషాదులు బస్తీపారాణి రాయించుకొని (పిలవని!) పేరంటానికి వెడుతూన్నట్టు తెలుస్తుంది. ఒక్కొక్క-చోట, ఇంట్లోంచి ఇవతలకీ, ఇవతలనుంచి ఇంట్లోకీ వెళ్ళిపడడం అనేది క్రతువులాంటిపని అయిపోతూండడంచేత, అక్కడి యజమానులు తప్పనిసరి అయినప్పుడు తప్ప కొంపలోనే పడుండి, యథాశక్తి దేశాభిమానం అని చెప్పదగిన గృహాభిమానం నేర్చుకుంటూంటారు.

బస్తీరోడ్లవల్ల ప్రయోజనాలు ఒక్కమాటు చూసి పట్టెయ్యొచ్చు. రాత్రిభాగంలో కొందరు వయస్సొచ్చిన స్త్రీ పురుషులు తమయింటి ఎదరకాని రోడ్డుని బాహ్యానికి ఉపయోగించి ఆపని నెరవేర్చి రావడంలో తమరు ప్రకటించగలిగిన ధైర్య సాహసాలకీ తెలివితేటలకీ అభినందించుకునే వాళ్ళూ, తమ యింట్లో ఉండేజనంచేత మన్ననలూ స్తోత్రాలూ పొందే వాళ్ళూ ఉన్నారు. కొందరికి ఇంటి ఎదటిరోడ్డే తమకున్న ఖాళీస్థలం అవడంచేత స్నానాలూ తలంట్లూ రోడ్డుమీాదే. భోజనాలకి, కజ్జాలకి, పురుళ్ళకి, పూణ్యాలకి, ఓకేమిటి సమస్తానికీ

కొందరిపట్ల రోడ్డే ఆధారం. ఎండపెట్టుగోడాలన్నీ రోడ్డుమీదే. కొందరు పశువుల్ని పెంచడం, కట్టెయ్యడం — అంతా రోడ్డుమీదే. కొందరు తమయింటి ఎదటిరోడ్డుమీద తమహక్కు స్థాపించుగోడానికే తమరుగోడ్డుమీద కలాపు చల్లి ముగ్గెట్టడం. ఇతరులెవరూ దొంగతనంగానేనా పట్టి గెళ్ళరుగదా అనేధైర్యం గలిగించే వస్తువులన్నీ కొందరు రోడ్డుమీదే దాచుగోడం. కొన్నిరోడ్లమీద రాత్రెళ్ళు ఎడాపెడా పడే వేసంకాలపు మంచాలమధ్య కుక్క లుండి, దారెంట వెళ్లవలసినవాడు కాలెట్టడానికి అవకాశం ఉండదు. చాలా బస్తీరోడ్లమీద ఇటీవల బయల్దేరిన సోడాకొట్లవల్ల దారి మూసుగుపోతోంది — మాసిన శిలకాయిలాగ. ఈ కొట్లు దేవదారువీ, కర్రవీ, క్రమేపీ ఇనపవీకూడా అవుతున్నాయి. రోడ్డు ఎంత యిరుకుదైనాసరే, రథంలాంటి సోడాకొట్టు, పాలకసంఘానికి ఫీజు కట్టేసి, అక్కడే తనూ ఇరుకుతుంది. ఒకటి పుట్టేసరికి దినా దినాభివృద్ధిగా పిల్లల్ని పెడుతుంది. వీటిల్లో వంటకీ, భోజనానికీ, పడకకీ, విశ్రాంతికీ — అంతస్తులూ, బిలాలూ రహస్యమార్గాలూ అవన్నీ దుర్గానికి ఉన్నట్టు ఉంటాయి. వీటికి కిందచక్రాలు పెట్టిస్తున్నారు కొందరు, కొండలకిరెక్కలు పురమాయించినట్టు. ఈదెబ్బతో బస్తీకి రథాలులేని అపకీర్తిపోయేట్టు కనిపిస్తుంది.

అయితే, రోడ్డుగురించి ప్రథమసూత్రం ఏమిటంటే, గమనం గలిగిన జంతువులే కాకుండా చలనంగలిగిన పదార్థాలుకుడా

రోడ్డుని వాడుకోడానికి హక్కు గలవే, అని. కాని, ఎవరైనా సరే, వీలైనంత త్వరలో వాడుకుని ఇతరుల వాడకానికి దానిని వదిలేస్తూండాలి. అందుకనే, ఎంత తక్కువ కాలంలో దానిని వాడుకుని వదిలెయ్య గలవాడైతే, అంత వెంటనే అది వాడుకోడానికి వాడికి మొదటిహక్కు ఏర్పడుతుంది. ఆ మొదటిహక్కులో ఉండేనయినం గమనించి పేచీలు రాకుండా గమనాలు నడిపించడం నిమిత్తమే కూడలి వీధుల దగ్గిరా, మలుపులదగ్గిరా, పోలీసుసోదరులు ఖణాయించి చేతులు — (అవి మీసాలుసర్దుకోడంలాంటి ఇతరపన్లో లేనప్పుడు) — తిప్పుతూండడం. ఈహక్కు పుణ్యమాఅనే, ప్రపంచప్పగొప్ప బస్తీలలో ప్రమాదాలు జరిగి రోజుకి సగటున నలుగురు మొదలు పదిమందిదాకా మనుష్యులు ఖర్చుపడుతూ ఉండడం. పోనీ, హక్కుమాట సరేగాని. మరి బాధ్యత ఎవరిదీ? అంటే, ఆమాట అంటేనే చాలమందికి కోపం! పైగా అది వేరే సంగతి!!

---

# అయోమార్గం - అభినందనం

రైలుయొక్క మార్గం అయోమార్గం అయినా, దాని యొక్క వ్యాపారంలో కొంత స్తబ్ధత్వం, కొంత హడావిడిగుణం, కొంత క్రపిడితనం ఉన్నా, అది అస్పష్టపద్యారోపితం అయిన గానాభినయంలాగ, శుద్ధఅయోమయం కాదు. దాని సంగతి ఏకొంతో అందరికీ తెలుసు. ఆవిరి, విద్యుత్తు, అయస్కాంతం వగైరాల శక్తులవల్ల దానికి గమనం సిద్ధిస్తుందనీ; దాన్లో భూమిని పట్టుకుపాకేరకం - భూగర్భం చొచ్చుకుపోయేటట్టు నిర్మించబడ్డ గొట్టాలలో చరించేరకం - భూమికి కొంత ఎత్తున స్తంభాలమీద వెళ్ళేరకం - ఒకేపట్టామీద పోగలరకం - పట్టాలున్నా వాటిని తాకకుండా నడవగలరకం - వగైరా ఉన్నాయనీ; దానిశాఖలు కొన్ని ప్రభుత్వాల కిందా, కొన్ని రాష్ట్రాల అధీనంలోనూ - కొన్ని పిడిసంస్థలైన కంపెనీల చేతుల్లోనూ - ఉన్నాయనీ; ఎరుగున్నవిషయాలే! గమనానికి పట్టాలుండడం ప్రతిబంధకం అని కొందరు భావిస్తారు. స్థిరమార్గం నిర్ణీతం అయిఉండడం అనేది వేగాంతరసిద్ధికి దోహదకరం అని కొందరు నమ్ముతారు. మొట్టమొదట్లో రైలుపట్టాలు భూమండలంమీద పడి ఇప్పటికి నూరేళ్ళు నిండి పురస్కారం దాటింది. ఆ భాగ్యం పొందిన పుణ్యస్థలం సీమదేశమే. ఆ స్థలంలో రైల్వేశతాబ్దోత్సవం జయప్రదంగా జరపాలని (వార్తాపత్రికారచనలో జయప్రదంకాని సంభవమే ఉండదు!) ప్రయ

త్సాలు చేశారని చెప్పుకుంటారు. ఇండియాలో రైల్వేసహా ప్రమాణోత్సవం పెట్టించా లని చాలామంది తంటాలు పడ్డట్టు తెలుస్తోంది. దరీఅంచూ తెలియని మహాకాలంలో సంస్థల యొక్క పర్వోత్సవాలు జరపడంలో తిథివారనక్షత్రాలతో సహా అసలుదినం గమనించక్కర్లేదనే విశాల భావంతో కొందరు, వీలునిబట్టి వాటిని పెట్టించడాలు ఎరుగుదుం. మంచి యితర సందర్భం సంఘటించినపుడు దాన్ని దాట పెట్టు గోడంలోఉండే బాధనిబట్టీ, గొప్పవ్యక్తి తనంతట తనే వచ్చి నప్పుడు ఖర్చులేకుండా అతణ్ణి అధ్యక్షుణ్ణి చేసుగోడంలో ఉండే సదుపాయాన్ని బట్టీ, ఒక్కొక్కవ్యక్తి తను కార్యకర్తగా ఉండగానే వీలైనంత గొప్పతనంగల సమావేశం జరగాలిగాని కడంవాళ్ళహయాంలో కాకూడదనే పట్టుదలలనిబట్టీ, సంస్థల ఉత్సవదినాలు ముందుకీ వెనక్కీ జరుగుతూంటాయి. రైల్వే విషయంలో మరీ వీళ్ళున్నాయి. పైచెప్పిన రెండు ఉత్సవాల లోనూ ఏ ఒకటీకూడా లోగడ జరిగి ఉండకపోయినప్పటికీ — వాటిల్లో ఏదో ఓటి, ఏదో దేశంలో ఇకముందు ఎప్పుడో అప్పుడు ఎవరో కొందరు జరిగించినా బాధ లేదంటున్నారు. ఎందుకంటే, ముందు ఒకగొప్ప ఉత్సవం కానిచ్చేసి తదుపరి వెనక్కి తిరిగి లెఖ్ఖచూసినా, ఆదినం రైల్వే సంస్థకి చెందిన ఒక గొప్పవిషయం ఒక గొప్పదేశంలో జరిగిన పర్వదినం అయి ఉండి తీరుతుంది. ఇది గాక, అయోమార్గం యావద్భూ తలానికీ చెందినదే గనక, భూప్రజలంతా కలసి దాని తాలూకు

పర్వోత్సవం చెయ్యడం సముంజసం గాని, ప్రత్యేకస్వయంపాకాలవల్ల డబ్బు సున్నవడం గౌరవం సున్నవడంమట్టుకే అని ఆర్యులు చెబుతున్నారు. ఆ ఉత్సవంయొక్క సంపూర్ణ బాధ్యత వహించడానికి ఒక పెద్దసంఘంఏర్పడాలని ఇదవుతున్నారు. అది అఖిల భూగోళ ఖండఖండాంతర స్థాపిత వివిధాయోమార్గ సంబంధిజన, వ్యక్తి, సంఘ, సంస్థాప శాఖాచరిత మహాకృత్యాభివందనీ సమాజం అనేలాంటిపేరుతో సక్రమంగా నిర్మించాలని పలువురు ఊహిస్తున్నారు. ఏతత్ ప్రయత్నంలో, ప్రత్యేక ప్రాంతాలలో తాత్కాలిక సంఘాలు లేచి, యథాశక్తి కార్యదర్శుల్ని ఎన్నుకుని, వారికి బాధ్యతాశూన్యమైన సకల హక్కులూ ఇచ్చి, కృషిచేయించడం శ్లాఘనీయం అని కూడా చాలామంది తాత్పర్యం.

ఆమహాభూతల రైల్వే పర్వోత్సవం నాటి కార్యక్రమంయొక్క తబిశీళ్ళు ఆహ్వాన సంఘంవారు తేల్చాలి. అప్పుడు జరగబోయే బహిరంగసభకి అధ్యక్షత వహించడానికి భూజను డెవడూ పనికిరా డనిన్నీ, అఖిల అంగారకగ్రహ రైల్వేసంఘాధ్యక్షుణ్ణి పిలుస్తారనిన్నీ, అతని ప్రయాణపుఖర్చు నిస్తంత్రిలో పంపుతా రనిన్నీ, అతగానికి ఏవాహనం కుదరక శరీరతః రావడానికి వీలు లభించని పక్షంలో అతను రేడియోలో అధ్యక్షత వహిస్తాడనిన్నీ, ఒకప్రాంతపు కార్యకర్త అంటున్నాడు. దైవాద్వా అంగారకుడులో కూడా (అసలు అది యుద్ధగ్రహంగనక !) రోముకాడీశ్వరుడులాంటి

వాడుగాని, బెర్లిన్ జులుందారువంటివాడుగాని నియంత ఒకడు వున్నట్టాయినా, అతణ్ణే అద్యక్షపదవికి ఆహ్వానిస్తే తీరి పోతుందని సలహా యిస్తున్నారు. కాని అలాంటివాణ్ణి యీభూమిమీద అడుగెట్టనిస్తే, అతడు తన్నో, తిట్టో, బెదరించో లాగేసి యీభూమిమూవత్తూ వెనక తనదే అనడంగాని లేక తనవాళ్ళందరికీ యిక్కడ ఉద్యోగాలకి సిఫార్సుచెయ్యడంగాని మొదలు పెడతాడేమో, అని కొందరు బాధపడుతున్నారు. అంగారక గ్రహంలోంచి కాకుండా మరోగ్రహం దేల్లోంచేనా అధ్యక్షుని పిలిస్తే ౧౯౯౧ లో "గజ్మన్" అనే ఆమెచేత వాగ్దత్తం చెయ్యబడి నేటి వరకూ ఎవరిచేతా పొందబడకుండా నిల్చిపోయి ఉన్న వెయ్యి పౌనుల బహుమతీకూడా, దఖలుపడుతుంది కదా అని కొందరు అంటున్నారు. ఏమయినా మహాసభా ధ్యక్షుడు - ఆహ్వాన సంఘాధ్యక్షుడు - అన్నట్టు, జరిగేస్థలం వగైరాలు ముందుముందు స్థిరపడవలసిఉన్నా, ప్రస్తుతం తెలుగుదేశపు వివిధకార్య కర్తలకి కాబోయే సభనిమిత్తం జనంచేత యథావిధిగా పంపబడ్డ చిత్తు అభినందనతీర్మానాలు కొన్ని తెలిసిరావడంవల్ల, అవిపరీతిగా ఉండగలవోచూడ డానికి వీలు దొరికింది. అవి ఈక్రింది విధంగా ఉన్నాయి:

నరాలవల శరీరంలో వ్యాపించిఉన్నట్టు, ఇప్పటికే ప్రతీ దేశంలోనూ రైలుపట్టాలు వ్యాపించి ఉన్నా, ఇప్పటికీ "మొయిలు వెళ్ళి పోయింది గావును, నేను చూడా లనుకున్న

ప్లాటుఫారంగార్ని చూణ్ణేలేదు!", "నల్లటి మెడ్లకి గంతలు కట్టి రైళ్ళు లాగిస్తారు" "ఒకొక్క బూమ్సుబండికి రొండేసి తలకాయ లుంటాయి!" "మావూరికి పిక్కంటిమ్మంటే ఎక్కడికో సెప్పమంటాడేటి? నావూ సీడికెందుకన్నాను!", "ఏడూరికి టిక్కట్టిమ్మన్నా, ఒకేదగ్గిర దాన్ని నొక్కి టిక్కుమనిపిస్తాడే!" అని అంటూండే జనంగురించి ఈ సభవారు చాలా దుఃఖిస్తూ వీళ్లు ఒకప్రత్యేక తీర్మానగౌరవం పొందడానికి అనర్హులని నిర్ధరించి, జాలిపడుతున్నారు. —

ఏదో దేశానికి చెంది, కోటీశ్వరులై, ప్రభుత్వబలం యొక్క ఆసరా చూసుగుని స్వాధీన దేశాల్లోఉండే గృహారామక్షేత్రాదులు బలత్కారంగా కొని, వాటిని శూన్యస్థలాలుగా చేసి, ఇనపపట్టాల సంకెళ్ళతో ఆస్థలాన్ని కట్టేసి తద్వారా రసయోగం తెలియకుండానే తమ ఇనుముని బంగారంగా మార్చుకో గలిగిన రైల్వేసంఘాల్ని ఈసభవారు కొనియాడుతున్నారు. —

ఒకొక్క వ్యక్తిచేతులో రూపాయిపడిందంటే బొగ్గులా మారిపోడం మామూలు గనక, జనబాహుళ్యం విడివ్యక్తులలో నమ్మకం ఉంచరని గ్రహించి, సంఘాన్ని నమ్మించడానికి సంఘమే ఉండాలని తెలుసుకుని సంఘాలుగా ఏర్పడి, బొగ్గుని రూపాయిలుగా మార్చుకో గలిగిన రైల్వేబుద్ధివంతుల్ని ఈ సభవారు మెచ్చుగుంటున్నారు. —

పెట్టుబడులకీ ధరలకీ సంబంధం ఏముటో జనానికి తెలియ

రాకుండా అట్టేపెట్టి, రుచి కలిగేవరకూ ధరలు తక్కువగా ఉంచి, అలవాటు స్థిరపడడంతోటే ధరలు క్రమక్రమంగా హెచ్చిస్తూ, పోటీకోసం సబబులేని తగ్గింపులు చేస్తూ, లాభాలు పుచ్చుగునే వాళ్లు ఎక్కడుంటారో కనబడకుండా వ్యాపారం చేయిస్తూ ఉన్న రైల్వేప్రజ్ఞావంతుల్ని ఈసభవారు పొగుడుతున్నారు. —

అయోమార్గాలు మామూలుగా జనోపయోగ నిమిత్తం అని పైకికనపడ్డా యుద్ధంలాంటి అవసరం వచ్చినపుడు స్వలాభం కోసమే అని ఎరిగుండి వ్యవహరించే రైల్వేపెద్దలికి ఈసభ వారు నమస్కరిస్తున్నారు. —

వర్ణాశ్రమ ధర్మాలనంటి తారతమ్యాలు మనుష్యుల్లో కూడునా, రక్తాల్లో తేడాలుంటాయి గనకనా, అంతా ఒకటే అనేటంత సర్వసమత్వం తెలిసిన జాతికి చెందినప్పటికీ, అయో మార్గంలో మొదటిక్లాసు, రెండోక్లాసు, మూడోక్లాసు అంటూ తరతమభావం పెట్టిన రైల్వేసంఘాలవారి వివేచనా శక్తికి ఈసభవారు ముక్కుమీద వేలేసుగుంటున్నారు. —

పెద్దబస్తీలలో, ముందు ఊరవతల ఒకస్టేషనూ తరవాత నాలిక కరుచుకుని ఊళ్లో ఒకస్టేషనూ వేసి, ఊళ్లోదానివల్ల వచ్చే డబ్బు పట్టిగెల్లి ఊరవతలదాన్ని పెంచి, ఊళ్ళోదాన్ని వీలైనంత ఇరుకుగానూ ఏహ్యంగానూ ఉంచినందుకు, ఈసభ వారు రైల్వేఅధికారుల్ని ఏమనాలో తెలియకుండా ఉన్నారు. -

నాలుగేసి వందలమంది ఒక్కొక్కరైలుకి ఎక్కే స్టేషన్లలో

జనం విశ్రాంతి తీసుగోడానికి నాలుగైదు బెంచీలు సప్లయిచేసి యథాశక్తి ఏర్పాట్లు చేసిన రైల్వే అధికారుల్ని ఈసభవారు శ్లాఘిస్తున్నారు. —

ప్రతీ ప్రయాణీకులబండీ బయలుదేరడానికి రెండుగంటల పూర్వమే టిక్కట్లకిటికీ తెరిచి ఉంచుతున్నాం అనే రాతతో కిటికీకంటె పెద్దబల్ల కట్టి అక్కడ పేర్కొనబడ్డ గంట ఒకటికి నిమిషాలు రెండుమాత్రమే అనే పరా రాయడం మరిచిపోయిన రైల్వే అధికారుల్ని ఈసభవారు మహావ్వా అంటున్నారు. —

రైల్వే ఉద్యోగాలికి జీతాలు తక్కువ అయినప్పటికీ కొన్ని వందల చేతిసొమ్ము అయినాసరే రవంత ఉద్యోగం రైల్వేలో దొరికితే చాలు అనేటంత ఆదాయం ప్రతీ రైల్వే ఉద్యోగస్థుడికీ ఉంటుంది అనేభావం - భ్రమ ! — జనంలో కలిగించిన రైల్వే యజమాన్లకి ఈసభవారు హారతి యిస్తున్నారు. —

క్రింది రైల్వే అల్పోద్యోగి లగాయితు పైమెట్టు ఉద్యోగి వరకూ అధికార్లిచ్చేజీతం తాకీఖుప్రకారం పుచ్చుగుంటూ, అందుకు అదనంగా, జనం — తమపన్లు అర్జెంటుగా లాభకరంగా నెరవేరిసందుకు — సంతోషించి యిచ్చే ధన కనక వస్తువాహనాలు తప్ప, తక్కిన మరి ఏయితరమైన లంచాలూ కానుకలూ స్వీకరించకుండా కట్టుదిట్టాలు చేసిన రైల్వే కారకుల్ని, ఈసభవారు ఘనత పరుస్తున్నారు. —

రైల్వే పాలకులు తమపరిపాలనలో, ధనాధికార పైత్యవిశే

షాలు గాని, వాగ్ధాటిగాని, కూరగాయలు – వస్తువులు – ముడిసరుకులు వగైరాల్లో వర్తకంగాని, గలవాళ్లని, – ఎందుకేనా ఎప్పటికేనా మంచిదని చెప్పి – కాస్త చల్లని చూపు చూసి, తక్కినవాళ్ళమీద రూలు ప్రకారం కారాలూ మిరియాలూ నూరడంలో కనపరిచే నిష్పక్షపాతబుద్ధికి ఈసభవారు ఆశ్చర్యపడకుండా కూచున్నారు. –

తమ రైలుబైముకి ఒకజాము ముందువెళ్ళి, దాన్ని గురించి తపిస్తూ, ఇంకా అది ఎంతసేపటికి వస్తుందని – తమకు ఫలానా అప్పుడూ అని తెలిసుండీకుడా – కనుక్కుంటూ, కనుక్కోడంలో చివాట్లు తింటూ ప్రయాణాలు చేసేవాళ్ళకీ, రిష్టువాచీ చూసుగుంటూ అంచీలమీద స్టేషన్లోపడి కటాకటీగా రైలుదాట పెట్టుగునే వాళ్ళకీ, ఈసభవారు దణ్ణాలు పెట్టి, చెరిసహం చొప్పున పై రెండు తరహాలవారూ ఆదణ్ణాలు పంచుకోవలసిందిగా కోరుతున్నారు. –

కుష్ఠులు, బధిరులు, పంగులు, అంధులు, భిక్షులు, – లాంటివాళ్ల అవస్థ దుర్భరంగనక, వాళ్ళు రైల్లో ముష్టెత్తుగోడానికి వాళ్ళని ఊరికే రైలెక్కనిచ్చి, తద్వారా యథాశక్తిదానం చేసుగుంటూ పుణ్యం ఆర్జించుకోడానికి ప్రయాణీకులకి తరుణంయిచ్చి, మరొకళ్ళఖర్చుమీద రైల్వే మేష్టర్లు కనపరుస్తూండే దాక్షిణ్యానికి ఈసభవారు వారిని చాలా కీర్తిస్తున్నారు. –

టికెట్లుకొనుక్కునేటప్పుడు: ఓపక్కనించి వెడితే ఆలస్యం

అవుతుందేమో, తమదికి టిక్కెట్టు అందక తమరు మిగిలి పోవలిసివస్తుందేమో, పెందరాళే కొనుక్కున్నవాడు ముందెళ్లి పోతాడేమో అనేబాధ చొప్పున అదివరకే అక్కడ నిలబడి ఉన్న వాళ్ళని తొక్కుకుని, వాళ్లమీద తమచుట్ట ఉమ్మి అభి షేకించి తమ 'టముకు' పెట్టె మొనతో వాళ్ళనిగుచ్చి, టిక్కెట్ల కిటికీమీదికి ఎగబడే ప్రయాణీకులు బతుకు తెరువు తెలిసిన వాళ్లు గనక, వారి అవ్యక్త ఔన్నత్యానికి ఈసభవారు, వారిని నెత్తిమీద పెట్టుగోవాలని చూస్తున్నారు. —

తమయిష్టం వచ్చినచోట తమరు నిలబడి తమ ఎదురు గుండా ఏపెట్టె కనబడితే అందులోకే ఎక్కి, అందులో ఎంత మంది ఉన్నా సరే వాళ్లని 'తప్పదు గనక సర్దుకోవాలి' అంటూ, 'ఎంతసేపు - క్షణం' అంటూ వాళ్ళకి వేదాంతంబోధిం చుతూ బాధించుతూ ఉండే జ్ఞానులకి ఈ సభవారు వందనాలు అర్పిస్తున్నారు. —

"టిక్కట్టు" అంటే రైల్వేకంపెనీవారు అది కొనుక్కున్న వాడి శరీరాన్ని - దైవకృప ఉంటే - దానిమీద రాసిఉన్న ఊరికి తీసికెళ్ళి వదిలిపెడతాం అని టిక్కట్టు కొనుక్కున్న వాడితో పడ్డ పూచీమాటలుగల అట్టముక్క అనేసంగతి గమ నించక, టిక్కట్టు అనేది తాము తమపక్క కూచున్న వాడి మీద చలాయించడానికి ఏర్పడైన అధికారానికి చిహ్నమని భ్రమించి వింతరకపు జంతువులుగా తయారయే ఘనుల్ని చూసి ఈసభవారు హడిలిపోతున్నారు. —

ఖాళీగా ఉన్న పెట్టె వెతికి తనూ తన సామానూ అందులో పడడంతోటే ఫెడీమని తలుపువేసి, వెనకాల ఎక్కబోయే వాడి వేళ్లు పచ్చడైనాసరే చూడక, 'ఖాళీ లేదు. పక్క పెట్టెలోకి వెళ్ళండి' అనే మాదిరి అమూల్యమైన సలహాలు ఇచ్చే మహానుభావుల్ని తగినంత మెచ్చలేక ఈ సభవారు తారెత్తిపోతున్నారు. —

డబ్బోసి టిక్కట్టు కొనుక్కున్న జనం, ఒక్కొక్క పెట్టెలో, నియమితసంఖ్య దాటించి, — ఎవర్నీ ఏమి నడగాలో నోరులేక అడగగలిగినా పని కొందరవల్ల తీరికలేక — పడుగూ పేకాలాగ నిలబడి ఉన్నా, అందులోకే, లోగడ ఆర్జించిన సొమ్ము వడ్డీకేసుగుని కుష్ఠో గుడ్డితనమో కలిగిఉండడం వల్ల రాజకీయమో వేదాంతమో పాడుకుంటూ, పెట్టెల్లోకి జొరబడి, నలుగురి ఎదుటా దమ్మిడీయో కోలియో దానంచేసి కొంతవరకు దానకర్త అని పేరు పొందాలనుకునే ఉదారుల్ని హృదయం కరిగించే మాటలు చెబుతూ, ఈ లోపుగా తమరి శరీరానికిగల వ్యాధి, కుళ్ళూ, ధూళీ, మురికీ ఈ మూలనుంచి ఆ మూలకి కూచునే జనానికి రుద్ది, వ్యవహరించే ముష్టివాళ్లనిన్నీ, కంపెనీలవెల్లడినిమిత్తం చౌకగా సాంపిల్ మందులు అమ్మడానికి ఉపన్యసించే ఏజెంట్లనిన్నీ, ఏమూల నుంచో వచ్చి మేజిక్‌లు చేసేవాళ్ళనిన్నీ, మంచిగొంతుకతో పాడి రకంవారీ పాటలపుస్తకం అమ్మేవాళ్లనిన్నీ, వస్తువులు అమ్మేవాళ్ళనిన్నీ, రూపాయిఖరీదుచెప్పి చివరికి అయిదుకాన్లకి

శేరంచెయ్యడానికి వీలైన పుస్తకాలు వంటిమీద ధరించి, ఘాట్లరకాలూ, వాట్ల ఉపయోగాలూ గురించి ముచ్చటించే వారినిన్నీ, శృంగారపు బొమ్మల పుస్తకాలు తెచ్చి షోకుగా వేషం ధరించిన వారితో వ్యవహరించే వారినిన్నీ, "జోబిదొంగల" కత్తిరింపులు తిన్నవారినిన్నీ, సూటుకేసులు మారుగిళ్ళు అయినవారినిన్నీ, ఈ సభవారు చాలా స్తోత్రం చేస్తున్నారు. –

రైలుపడి ఇంతకాలం అయినా రైల్లో పాకీదొడ్డి ఎప్పుడు ఎట్లా ఉపయోగించాలో తెలుసుకోలేని పెద్దల్ని గురించి ఈ సభవారు నాభికగ్గిర్నించి డోక్కుంటున్నారు. –

రైల్లో ఎక్కగానే జనసమూహం ఏర్పడ్డా, (అధ్యక్షుడంటూ, దిగి ఎక్కేచోటు గనక, వీలులేక) జనానికి అనుజ్ఞలుండవలసిన అవసరం లేదుగనకనున్నూ, టిక్కట్టు కొనుక్కోడంతోటే కొందరు తాము హృదయశూన్యులై తమపక్క తమరికి మల్లేనే ఇష్టాయిష్టాలుగల సజీవవ్యక్తులు కూచోడం తమరు మరిచిపోవచ్చని అనుకోడంచేతనున్నూ "పొగబండి" అనే మాట రైలుకి ఎక్కడ సార్థకం కాకుండా పోతుందో అని పక్కబెమరు కలిగి ఉండడంచేతనున్నూ, ఏదో చెయ్యకుండా ఊరికే కూచోడం కష్టంగనకనున్నూ, రైల్లో చుట్టలుకాలుస్తూ గాలివాటం చూడకుండా కూడా ఉమ్మలేసి అవన్నీ నిప్పు నెరుసులున్నూ ఇతరులమీద పడుతూండడం చూసికూడా హాయిల్గా ఊరుకునే ధీరులకి, ఈ సభవారు కైవారం

చేస్తున్నారు. —

మగసాయం లేకుండా, ఆడవాళ్ళ పెట్టెల్లో కూచోకుండా ప్రయాణించేసే స్త్రీలున్న పెట్టి చూసుకుని ఎక్కే నాజూకు వేషధారుల్ని వారి స్త్రీతికా వాత్సల్యానికిన్నీ, సుందరమైన విగ్రహాలుగల స్త్రీలున్న బండీ మాత్రమే ఎక్కే లౌక్యుల్ని వారి మాతృభక్తికిన్నీ ఈ సభవారు ప్రస్తుతిస్తున్నారు. —

డబ్బుండీ, రైలుతొందరలో కాఫీహోటల్లో అడుదుం బడుదుం అంటూ పావలాసరుకు నిలువుకాళ్ళమీద పరామర్శించి, గబాగబా రైల్లో పడి, వేషంలోనూ జుట్టులోనూ నాగరికత వెడలగక్కుతూ, చదవడం తెలిసినా నూతనవార్తా ప్రియత్వం ఉన్నా, చూసిచూసి అర్ధణా పెట్టి స్వంతానికి పత్రిక కొనుక్కోక పక్కవాణ్ణి "మీరు పేపరు చదివారా?" "మీ పేపరు ఓసారి ఇస్తారా?", "మీపత్రికలో ఒకషీటు విడగొట్టి ఇల్లా ఇస్తురూ" అని ఎరగనివాడి దగ్గిరకూడా యాచించో, పక్కవాడు తనపేపరు తను చూసుకుంటూంటే అతడిమీద శ్వాస లొదుల్తూ దగ్గిరకొచ్చి తనూ చదువుకుంటూనో, లేక ఎరగనివాడు తను కొనుక్కున్న పత్రిక అక్కడ పెట్టి ఏ స్నేహితుడితోటో కబుర్లు చెప్పుకోడంలో ఉండగా వాణ్ణి అడక్కుండా తీసేసుకునో, ఇట్లా చెయ్యడంలో తనయొక్క గడుసుదనానికి లోపల తనే ఆనందించుకుంటూ, పులిస్తరాకులమీద జంతువులు ఎగడ్డట్టు, పరాయివాడి పత్రికమీద విరుచుకుపడి, తను దిగేవరకూ ఆ ఎంగిలిపత్రిక ఇదిగో అని యజమానుడికేనా

యివ్వకుండా, చదువుతూండే ధనికులయొక్క ధనత్వం, ధన్యత్వం, సరసత్వం గురించి ఈసభవారు బెంగెట్టుగుపోయి హాోరున, ఆనందిస్తున్నారు. —

గంటలకి గంటలు ప్రయాణం ఉన్నా, ఏమీ చెయ్యకుండా కిటికీకి దగ్గిర స్థలం సంపాదించుగుని, తమ తాలూకుమూట పైన పెట్టుగుని, బయటికి చూస్తూ కిమ్మనకుండా గడిపే ఆలోచన పరుల్ని ఈసభవారు హెచ్చరిస్తున్నారు. —

సూటుకేసులు, పరుపులు, పీటలు వగైరాలు కిటికీల్లోంచి లోపలికి గిరవేటేసి రైలు ఇక వదలబోతోంది అన్నప్పుడు ఎక్కి, అదివరకే కర్మవశంచేత లోపల కూచున్న వీళ్లైనంత మందికి ముడుసులు విరగ్గొట్టేవాళ్ళ అహింసాభావానికీస్నీ, వేగానికీన్నీ ఈసభవారు వారిని మర్యాద చేస్తున్నారు. —

నిద్దర, జబ్బు, నోరు, జబర్దస్తీ, బిచాణావగైరాలు ఉపయోగించి నియమితస్థలం తమరు ఆక్రమించుగుని, అదే తమ ఆధిక్యత అని గర్వించే మహత్తరుల్ని ఈసభవారు ఆరాధిస్తున్నారు. —

పరాయివాడిచేత కిరాయిపెట్టించిగాని, బల్ల కింద దూరిగాని, పాకీదొడ్లో నక్కిగాని, సమయానికి అవతలవేపున దిగిగాని, ఇతరత్రా దగాచేసిగాని, సన్యాసులైగాని, కావలసినవారైగాని, సేవకులైగాని, నెత్తిమీద వారైగాని, తత్సంబంధం కలవారైగాని, ఎల్లాగో అల్లాగ టికట్టు స్వంతంగా కొనకుండా ఉచితప్రయాణంచేసే అదృష్టవంతుల్ని

ఈసభవారు బ్రహ్మరథం పడుతున్నారు. —

అతిజవంతో రైలు పోతూన్నప్పుడు అందులో కూచుని బయటికి చూస్తే దగ్గిరవని మనం అనుకునే వస్తువులు మన్ని విడిచిపెట్టి దూరంకావడమున్నూ, దూరానివే మన కూడా రావడమున్నూ ప్రతి సిత్యమూ గమనిస్తూండీ కూడా, తాపత్రయంపడే మహామహుల్ని ఈసభవారు ఊరేగించి గౌరవిస్తున్నారు. —

తను ఎంతో వేగంతో పోతున్నా ననుకుంటూ, రాత్రప్పుడు, నక్షత్రాలకేసి చూస్తే తనూ, తనవాహనం, తన లోకం - వీటి ఉనికీ ఘూకుడూ మాకేం తెలుసును అన్నట్టు ఆ నక్షత్రాలు నిర్నిమిత్తంగా ప్రకాశిస్తూఉండడం గమనించి మానవుణ్ణి అల్పుడుగా కట్టేవార్ని ఈ సభవారు నిరసిస్తున్నారు. —

శాంతంగా ఆలోచిస్తే రైలుప్రయాణం అనేది చిన్న ప్రమాణంలో జీవితప్రయాణం లాంటిదే అనిన్నీ, మానవ స్వభావాలు బయటపెట్టడానికీ మానవుల్ని తయారు చెయ్యడానికీ, అది చాలుననిన్నీ అనేవారిభావం శుద్ధ పేలవం అయినప్పటికీ వారు అట్లాంటివి ప్రకటింప సాహసించినందుకు ఈసభవారు వారిమీద కొంచెం కోపం దాల్చడానికి ముహూర్తం వెతుకుతున్నారు. —

---

# తిండి విశేషాలు

[12 - 11 - 1939 తేదీని రాజమండ్రీచుట్టుపట్ల ఒక వనంలో సంతర్పణ జరిగింది. ఆ తేదీనే చాలా జరిగిఉంటాయి గాని, వాటిల్లో ఇది ఒకటి. అందునిమిత్తం గ్రామాంతరాల్నించి సార్థకులైన ఆంధ్రఉద్యోగులు విరివిగా రావడానికి ఏర్పాట్లు కావడం, అట్లానే చాలామంది రావడం కూడా జరిగింది. దీన్లో అదనం ఏమిటంటే, సంతర్పణానంతరం — పోనీ, సంతర్పణకి తప్పనిసరి ఫలితంగా ఉండే క్షుద్రనిద్రానంతరం, అనగా మూడు గంటలికి ప్రారంభించి — ఒక మాటలప్రదర్శనంకూడా జరుగుతుందని కరపత్రాలు అచ్చుపడ్డాయి. అధ్యక్షులు ఫలానా, వక్తలు ఫలానాఅంటూ కార్యక్రమం వాటిల్లోఉంది. లోగడే కార్యదర్శిగారు నన్ను గౌరవించి ఆసందర్భంలో నన్ను ఒక వక్తగా ఉండకోరారు. నేను ఆయనికి విధాయకుణ్ణి అవడంచేత "కాదు" అననూ లేక, అయినా వెంటనే ఒప్పుగోనూ ఒప్పుకోక, "ఎంత చదువుకున్నవాళ్లయినా ఎంత 'అర్థం' చేసుకోగలవాళ్లయినా, ఉదాత్తంగా భోజనంచేసిన తక్షణం ఏ ఫలారంఅంటిదో పుచ్చుకోగల్రుగాని, ఉపన్యాసాల వంటివి బొత్తిగా స్వీకరించలేరేమో, ఆరకం పదార్థాలు ఆసమయంలో విషమించవచ్చునుమండీ!" అంటూ నసగడం మొదలెట్టినా, ఆయన తన ఉత్సాహంలో "వల్లకాదు, మీరు ఒప్పుగునితీరాలి!" అని, నాచేత "సరే లెండి" అనిపించి, వక్తల జాబితాలో నన్నుకూడా అచ్చుకొట్టేశారు.

అక్కణ్ణించి, నేనూ కొంచెం బుగ్రదులిపి, వెళ్ళడానికి వీలైన సామగ్రి కొంత సిద్ధం చెయ్యవలసొచ్చింది. మరో విషయం మరోవిషయం అయితేఅప్పట్లో మరీవికటించి పోతుందేమో అని భయం పట్టుకోవడంవల్ల, జనం అందరూ అంతకి పూర్వమే ఆచరణవల్ల గ్రహించిఉంటారుగనక భోజనప్రమేయమే ఎత్తుగుని కొన్నిసంగతులు వడ్డించుదాం అనిన్నీ, ఏఘట్టంలో పదార్థం మిక్కుటంఅయిపోయి వెళ్లిపోయేలా కనిపిస్తుందో అక్కడితోటక్కున ఆగిపోయి జీవక్షోభ కలగకుండా జాగర్త పడదాంఅనిన్నీ ఆయత్తం చేసుగున్నాను. అయితేం! మనవశమా! సంతర్పణఅయింది, రిమార్కులు అయినాయి, నిక్కచ్చిగా దంతపుపని చేసినవాళ్ళ ఆపసోపాలు అయినాయి, ఇటూ అటూ దొర్లుతూ కునుకులాగడాలు అయినాయి, కొంచెం గానాబజానాఅయింది, ఎల్లానో తంటాలు పడి, దాని మొహం ఈడ్చా, సాయంత్రం అయిదుగంటలు కూడా అయింది. తక్షణం కొందరు బ్యాంకుఉద్యోగులు, "కొంపతవ్వి కరపత్రాల్లో నిరూపించి ఉన్నప్రకారం, ఆలస్యం అయితే అయిందని, మీటింగూ దానితాలూకు ఉపన్యాసాలూకూడా ఎక్కడరద్దేస్తారోకదా, ఇవన్నీభరించడం ఎల్లారా భగవంతుడా!" అని బెంగపెట్టుగున్నట్టు బిక్క మొహాలు వేశారు. దానికితోడు మాముఖ్యస్నేహితు డొకాయన, "మరి ఆలస్యం చెయ్యక మీటింగు కానిత్తాం, బల్లలు సర్దండి" అనే సంగతి చకచకా నిష్కర్షగా మంచినీళ్ల ప్రవాహంగా

ఆంగ్లంలో అనేశాడు. "సభంతపనీ జరిగిపోయిం దన్నమాట రా దేవుడా" అని కొందరు ఉద్యోగులు నిస్పృహాలో పడిపోయారు. ఏనాడు చేసుగున్నదో మరి అనుభవించాలి గావును అనుకోడంవల్ల గావును, కొందరికి మొఖాన్ని కత్తి వాటువేస్తే నెత్తురులేదు. కాని కొందరు గడసర్లు ధైర్యం అవలంబించారు. "అన్నట్టు, ఫోటోతీయించుగోవాలి గావు నుగా! అదిచాలా ముఖ్యం. వెలుగుండగానే ఇల్లుచక్క బెట్టుగో మన్నాడు. ఫోటో చిక్కబట్టుగోమన్నాడు. ముందు ఫోటోయే! తరవాత తతిమ్మావి" అని మాట్టాడుతూనే, వాళ్లు, బల్లలూ, కుర్చీలూ అవీ ఉన్నచోటిన్నించి ఓ ఫర్లాంగు దూరం ఈడ్చేశారు. సూర్యాస్తమయంవరకూ వాళ్లు నిమ్మ నిమ్మళంగా ఫోట్టిగ్రాఫు దిగుతూనే ఉండిపోయారు. మెట్టుకి ఒక్కడూ వక్తలున్నవైపైనా రాలేదు. కార్యదర్శిగారు చాలా నొచ్చుగుని, వక్తల్ని క్షమాపణ కోరుకున్నారు. వానప్రస్థంరోజునే ఉపన్యాససన్యాసం కూడా సిద్ధించి శ్రమ లేకుండా రెండాశ్రమాలు లభించడం జన్మకి చాలుగదా అని వక్తలన్నారు. కార్యదర్శి ఆ ఫోట్టిగ్రాఫు చెట్టుదగ్గిరికి మళ్లీ వెళ్లి చూసొచ్చి, కొందరు కుర్చీలకి అంటిల్లా అయిపోయా రనిన్నీ, కొందరు మౌనవ్రతంలో పడ్డట్టు చెప్పారనిన్నీ, తక్కినవాళ్లు పంచబంగాళం అయిపోయారనిన్నీ చెప్పారు. "అయ్యా! ఇప్పుడొచ్చిన ప్రమాదంఏమీలేదు. శూన్యోప న్యాసాలకే, అర్థం చేసుకోగలవాళ్లు కూడా హడిలిపోవడం

వేళావిశేషం! మీరుచేసింది పదార్థాలసంతర్పణ, మాది పదాల సంతర్పణ. అదీ ఇప్పుడు కేవల తర్పణ అయిపోయింది. మాపదాలు మేం నోటితోనూ అనచ్చు, లేకపోతే ఆనోటి యెంగిలికూడా తగలనీయకుండా, పత్రాలమీదకూడా పెట్టచ్చు. అల్లానే కానిస్తాను. అసలు నేచెప్పదలిచిన దాట్లో కొన్ని లెఖ్ఖలూ, అంకెలూ వచ్చేసట్లు ఉండడంవల్ల అది లిఖితంచేసుగునే వచ్చాను, రచనకి కారకులుగనక మీకు ప్రత్యేక నమస్కారం. వద్దు మొర్రో అంటూ ఉన్న తమ సమక్షంలో చదవబడకుండా తప్పిపోడం అనే పుణ్యం నా రచనకి పుట్టగానే కట్టబెట్టిన తక్కినవారికందరికీ లోపాయి కారీగా నమస్కారం. సెలవు'' అని నే నన్నాను. అయి పోయింది. నిష్క్రమించి మేం వచ్చేశాం. రచన అల్లానే ఉండేసింది.

ఇంతలో 17—2—1940 తేదీని రాజమండ్రి ఆర్ట్సుకాలేజీ పూర్వవిద్యార్థి వార్షికోత్సవం తాలూకు సమావేశం వచ్చింది. నేను అక్కడ పూర్వవిద్యార్థినై ఉండడంవల్లా, ఆంధ్రదేశపు విద్యాధిక సమావేశాల్లో ఆ సందర్భపు సమావేశం ఒకటి అవడంవల్లా, విద్యాసక్తిగల స్త్రీ బాల వృద్ధులతో నిండిన సభ యెదట నిలబడి ముఖాముఖిగా మాట్లాడవలసిన అవసరం వచ్చినప్పుడు వక్త గమనింపవలసిన సార్వజనీనతా, మార్దవం, వైవిధ్యం, మోతాదూ గురించి అనేకంగా నేను నేర్చు గోడానికి అదే తరుణం అవడంవల్లా, ఆ సందర్భపు ప్రణాళికలో

నేనూ పడ్డాను. కాని, ఆరోజున ఇతరవిషయాల్లో చాలా ముఖ్యమైనవి ఉండడంచేత, నాకు ఇచ్చిన వ్యవధి చాలక, నాకు కొంచెం — అసలా చాలా — ఉక్కిరిబిక్కిరి అయింది. ఏదేనా సమగ్రంగా చెప్పడానికీ వీలులేకుండా, పోనీ మానడానికీ వీలులేకుండా వచ్చింది. నేను సరాసరా ఉపోద్ఘాతం కానిచ్చుగుని, "అబద్ధం ఆడడం" గురించి ఒక పరిచ్ఛేదం చదివి, విషయం మారుస్తున్నానని చెప్పి, ఈ క్రిందిరచనలో తిండిపోటీలున్న ఘట్టంలో కొంతమాత్రం తిరగేశాను. ఆవాక్యాలలో పేర్లూ, స్థలాలూ, అంకెలూ, లెఖ్ఖలూ, తేదీలూ ఉంటూండడంచేత వాటి యాథార్థ్యం నేను నమ్మే చదివాను. కాని, వాటిల్లో, చెప్పులుతినడపు పందెంసంగతి నేను చదువుతూన్నక్షణంలో, చీమకేనా సందులేకుండా ఉన్న ఆ మహాసభలోంచి ఒక పురుషుడు ( — శ్రీ శ్రీ సర్ కె. వి. రెడ్డినాయుడుగారు అధ్యక్షత వహించిన అంత సభలో ఉన్న అంతమందినీ నేను అసత్యాలు చెప్పి మోసగిస్తూన్నసంగతి తను ఒఖ్ఖడే హఠాత్తుగా పరిశోధించినట్టు — నేను అబద్ధం ఆడడం గురించి అంతకిపూర్వమే ముచ్చటించిఉన్న వాణ్ణవడంచేత ఆతరవాత నేను ప్రసంగించేది ప్రతీదీ మంచి అబద్ధం అయిఉండకపోతుందా అనే అఖండానుమానం తన్ని పీడించుతూన్నట్టు — ) లోకకల్యాణం నిమిత్తం నావాక్యం కేవలం కోత అని ఋజువుచెయ్యడానికిట, "కొయ్ కొయ్" అనే శంకారావం చేసి, తను రెండు కోతలు కోశాడు.

నావి ఆత్మస్తుతిగల వాక్యాలైఉంటే వాటిని రెండు కాదు మూడుకోతల దువ్వెన్నలాగ కొయ్యొచ్చు. కాని, స్థితి వేరు! వారు అవస్థావశంచేత గాత్రమీమాన్సానం నిమిత్తం రాజమంఢ్రీ వేంచేసిన తైర్థికులై ఉండవచ్చునని నా రాజమంఢ్రీత్వానికి తోచి, నేను ఆధ్వని వచ్చినవేపు తిరిగి, "అయ్యా! నావాక్యాలకి లిఖితమై నమ్మతగ్గ ప్రమాణం నాదగ్గిర ఉందండి! ప్రస్తుతం క్షమించండి" అనేసి, అప్పట్లో వ్యవధిలేని స్థితిలో ఉండడంవల్ల ఊరుకున్నాను. కాని, ఇప్పుడేనా సప్రమాణంగా ఉంటే ఆనాటి మహాసభకి హాజరైఉండి ఆవేళ కమామీషు జ్ఞాపకంఉండి, ఈ రచనచూడ తటస్థించే రాజమంఢ్రీవాళ్ళేనా నన్ను శంకించకుండా ఉంటారుగదా అనే ధైర్యంచొప్పున అటువంటి వాక్యాలచివర జగత్ప్రసిద్ధిగల ఒకానొక వారపత్రిక యొక్క సంచికనెంబరూ, మరి దానితరవాత ఆ సంచికలో ఆయా పోటీసంగతి అచ్చుపడ్డ పేజీ సంఖ్యా ఇచ్చాను. అన్నివేల సంచికలు కోతలతో భూమిమీద చెలరేగడం కష్టం. అయినా సరే, ఆపత్రికమాత్రం కొండమీంచి ఊడిపడిందా అంటే, మరి నమస్కారం!! పేర్లూ, అంకెలూ, లెఖ్ఖలూ ఉన్నాయిగా! హృదయం, బుర్రా, ఓపికా, పట్టుదలా ఉంటే ఋజువుచేసి చూసుగోడానికి వీలున్న సంగతులుకూడా చెవికి ఇల్లా తగిలాయోలేదో ఆపళంగా కొయ్‌కొయ్ మని గర్జించి తెయ్ తెయ్ మని ఆడేసేకంటె, తణిఖీచేసి యథార్థం తేల్చుగునేదాకానేనా ఆగడం ధర్మం. విద్యావంతుడు వినగానే తను

